# [illegible]



"అష్టావధానులు"

"విద్వాన్, కవిచంద్ర" కోట సుబ్రహ్మణ్య శాస్త్రి.
"విద్వాన్" కోట సత్య రంగయ్య శాస్త్రి.



ఆంధ్ర పబ్లిషింగ్ హౌస్,

మదరాసు. తెనాలి.

 1946 [వెల 0-8-0

No. Copice, 2000. First Edition. February, 1946.

# కానుక

•◦○○○◦•

శ్రీ సరస్వతీ గిరిజాప్రసిద్ధి నామ
దీప్తిఁ జెన్నారు భారత దేశమాత!
"కర్షక ప్రబోధ" మనెడి ఖండకావ్య
మప్పగింతుము నీచరణాబ్జములకు.

— రచయితలు.

A.P. House, Madras,Q.H. No. M.S.171, Copies 2000, 8-3-'46,

# అభిప్రాయములు

## N. G. రంగాగారు,

### స్వాతంత్ర్య దినోత్సవము

విమర్శనలు:

శ్రీ సోదరకవులు :—

శ్రీ కోట సోదరకవులు కర్షక ప్రబోధము రైతుల అనుదిన జీవితము గురించి వ్రాసిన మాధుర్య పద్యముల విను భాగ్యము నాకు కలిగెను. ఆముండ్లమూరు రైతు సభయందు వారి భావగర్భితమగు పద్యముల విన సొంపుగా చదువుచుండగా రైతాంగము యెంతో సంతోషమందిరి.

రైతాంగ జీవితము కష్ట భోజనమైనను రైతుల పరిసరములు సుందరమైనవంటారు ఈ కవులు. రైతులు ప్రపంచ ప్రజలనందరి పోషించుచున్నా వారికి నిండగు తిండి, గుడ్డలు లేకుండ చూచి వీరు హృదయవేదన పడుచున్నారు. రైతాంగ కృషి సకల జనులకు అత్యవసరమైనా రైతుల దౌర్భాగ్యమును తొలగించుటకు తగినంత ప్రయత్నము సంఘము చేయుట లేదంటారు.

రైతుల జీవితము న్యాయంగా ఆనందమయంగా వుండాలి. వారి పశువులు ప్రపంచమందంతటా శృంగారానికి పేరొందినవి. వారి గ్రామాలా వేలకొలది సంవత్సరాలనుండి స్వరాజ్య ఆశయాలు, ఆచారాలు పొందియున్నవి. వారి భూములా, నాగేళ్లా, పాలుఎరువులా, పంటలకలయిరా, పుష్పాల రత్నకంబళాలా, పండ్లు పంటల బంగారపు, వెండి, రాగి, కొండలా ప్రపంచ భాగ్యరాసులలో ప్రధానస్థాన మలంకరించుచున్నవి.

ఇంత వున్నా లాభమేమి? మన రైతాంగపు దారిద్ర్యము, నిరక్షరాస్యత, రాజకీయ దౌర్బల్యము ఆర్థిక బానిసత్వముపోవాలి. పోవాలంటారు మన కవులు. యీ బాధల కిక అంతులేకుండా యున్నది. అదే స్వరాజ్య సంపాదన అదే. ఆ స్వరాజ్యమును రైతుకూలి ప్రజారాజ్యముగా మార్చుకొనుటయే! రైతులు రాజ్యాధికారమును పొందాలి. అనుభవించాలి; తదితర గ్రామికులను రక్షించుకోవాలి; వారి సహకారాన్ని సంపాదించుకోవాలి. అప్పుడే భారత దేశానికి నిజమగు, నిండైన రక్షణ. ఆనందము సంప్రాప్తమగును. మన రైతాంగమున కౌలిస్తుల బాధలు తొలగాలి. తగ్గాలి. పండించే పంటలు హెచ్చాలి. భూములు బాగుగా పండాలి; మాగాణి వసతులు హెచ్చాలి; పండిన పంటల ధరలు హెచ్చాలి; పారిశ్రామిక వస్తువులన్నీ చౌకగా దొరకాలి. వ్యవసాయ కూలీలకు అనుదిన అవసరాలు తృప్తిగా తీరాలి. గ్రామాలు సర్వసౌభాగ్యవంతము, విజ్ఞానమయం కావాలి. రైతాంగ జీవితము ఆశాజనకం, ఆనందదాయకమవాలి యింక యెన్నో అవసరాలున్నాయి.

యివన్నీ తీరాలంటే యిప్పుడు రైతాంగిన్ని పీడింప చేస్తూయున్న, జమీందారీ పెత్తనం, షాహుకారి అధికారం, అందరి దోపిడీ

ధానం, పారిశ్రామిక వర్గాలు, దేశాల అన్యాయంపు ఆర్థిక ఆధిక్యత తొలగి పోవాలి. పుట్టినవారికెల్లా, తిండి, గుడ్డ, యిల్లు యింత బాధల నుండి రక్షణ, వయస్సులో నున్నవారికెల్లా యుద్యోగం, విశ్రాంతి, విజ్ఞానం అవసరం. యివ్వి యెలా సాధ్యమౌతాయి? రైతు కూలి ప్రజారాజ్య స్థాపనయైతేనే! అందులోనూ యే వొక్కవర్గం తదితర శ్రామికవర్గముల బాధించకుంటేనే!

అంతే పతితదేశాలు స్వతంత్రం పొందాలి; అవ్వి గాంధేయపంథాన నడవాలి. అందులకే యీ సోదరకవుల మృదుమాధుర్యముగు భావ ప్రపూరితమగు గేయములు అవసరము.

ఢిల్లీ,
26—1—'46

(సం॥ రంగా.

మా యీ జమీన్ ప్రాంతాల రైతులు తమ శక్తి సామర్థ్యాలు తెలిసికోలేక వెనుకబడియున్న కాలంలో యీ కోట సోదర కవుల మృదుమధుర కర్షక ప్రబోధం నూత్న చైతన్యాన్ని కలిగించింది. అందుకే ఓ రైతు కవీ! అన్ని సత్య రంగయ్య శాస్త్రిని ప్రబోధిస్తాం.

నెల్లూరు జిల్లా జమీన్ రైతు సంఘం,

17—1—46.

రవిపాటి మహానంద,
కార్యదర్శి.

# కర్షక ప్రబోధము



ఒక వృషభంబె శంకరున కొక్కటె ధేనువు వజ్రికిన్ హలం
బొకటి రేవతీవిభున; కున్నవి నీనిలయంబునందు లె
క్కకు మితిమీఱు గోవృషభగాధ హలమ్ములు రైతుబిడ్డ! నీ
విఁక ధనికుండవైతివి సురేశ గిరీశ హలీశు లందరన్.

శ్రీర్జయతు.

కిమపి : కిమపి :—

ఈ కావ్యము ఖండకావ్యము. కావ్యానికి ఒకనాటిలక్షణాలు వేరు. ఈ నాటి లక్షణాలు వేరు. లక్షణాలు వేరువేరుగా ఉన్నా కావ్యతకు భంగపాటు రాదనే నిశ్చయము. ఈ నవకాల సారస్వతేయులకు లేకపోలేదు. దీని కవయిత్రులు కనిగిరి నివాసులు కవి చంద్ర బిరుదాంచితులు విద్వాంసులు, రచనా ప్రవీణులు శ్రీ కోట సోదర కవులు. ప్రకటితములు అప్రకటితములు వీరి గ్రంధములు చాలా ఉన్నవి. వీనిలో కొన్ని కావ్యములు, కొన్ని నవలలు, కొన్ని నాటకములు, కొన్ని శతకములు ఇంకను కొన్ని కొన్నిరకములు. వివిధమార్గాలలో తమ వాక్కులను అనేకులు ప్రసరింపచేయడము అలవాటుగా ఉన్నది. వీరికిని అదికలదు.

శ్రీ కస్తూరిబా - మాతృశ్రీ - రాజరాజేశ్వరి - కన్యకాంబిక - మార్తాండ లింగప్రభు - రాజయోగిని - కనిగిరిదుర్గము - వరూధినీ విలాసము - కర్షక ప్రబోధము - ఇంకా ఈ దృశములు ఈ కోట కవులు రచించిన కృతులు. పొదిలి పౌరులు సాభిమానముగా కవి పండితులను సత్కరించుటకు అలవాటు పడిన సహృదయులు. కోట సోదరులకు కవి సమ్మాననమిచ్చి పొదిలి వాసులు భావుకత్వము పొందుపరుకొన్నారు.

అల్పకాయమయిన ఈ కావ్యములో ఒకానొక విశిష్టరమ్యభావము భావ్యమానసుభగముగా లక్ష్యమయింది. తెలుగు సారస్వతం బహుళంగా ఉంది. దానిరూప నిర్ణయంచేయడానికి నానావృత్తులను ప్రసరింప చేయాలి. ఇట్లా అసంకీర్ణంగా చూస్తేనే కొంతవరకయినా స్వరూప జ్ఞానం కలుగుతుంది. ఒక దృష్టితో ఒక దానిని కొలవడము కానిపని. సారస్వత విజ్ఞానము సర్వపరాతప అంచు బాటులో లేని దినాల్లో

విజ్ఞానాశ్రయులుగా ఉన్నవాళ్ళు వెలయించిన సారస్వతము తదితరులకు ఉపకరించేది కాలేదని అనడము యుక్తవాక్కు కాదు. ఏ కవి అయినా కాలప్రభావితుడు కాకపోడు. ఎంతగా కాలచక్రంలో ఒరుసుకుపోతూ ఉన్నా స్వరూపత్యాగం చెయ్యడు. ఏ విధముగా నయినా తన ఉద్దిష్టాన్ని విశదం చేసికొంటూ లోకకాలాలకు ఉపకరిస్తాడు. ప్రకృత కవయితలను పాఠకులు ఈ విధముగా చూడవచ్చు.

ఈ కావ్యము కర్షక ప్రబోధము. దీనిలో కవులు తలచిన ముఖ్యాంగములు ఇవి. రైతు ప్రబోధము. కష్టవిచారణ - ఉపదేశము- గర్హణము - కావ్యములో ఇవి దేనికి? ఇవి కావ్యత్వమును సంపాదించగలవా? అని కొందరి సంశీతి. వారి సంశయము వారి దృష్టిలో సముచితము. అస్మదీయుల సారస్వతములో ఒకప్పుడు బ్రాహ్మణయుగము ఉంది. అప్పుడు ఏ కవిత అయినా బ్రాహ్మణ సంప్రదాయ ధర్మవ్యవహార విహార వ్యాహారములతో నిండి ఉంది, క్షత్రియయుగము కుదింపుపొందిననాడు వారి వారి విలాసవినోద విక్షేపవిస్తృతులు కూర్పు పొందినవి. వర్తకయుగము కవితలో రావలసిన సమయములో ఇతర జాతులు నిద్రాణములు కాకుండా ఉండడముచేత ఆర్థికవిధానము అధికంగా మార్పుపొందడముచేత కేవలవైశ్య వ్యవహారములు కవితలో రాలేదు. సమకాలంలో వైశ్యయువకులు కవితాప్రియులు కాకపోవడమున్నూ హేతువు. ఆర్థికసమత్వము విజ్ఞానసమత్వము కలుగనిదే సర్వవర్గీణముగా అభ్యుదయం కలగదు. రైతువర్గాలలో ద్విజేతరులలో కొందరుమాత్రము ధనికులైధనిక ధనికులై ఉండడము మూలానా అవి పెట్టనికోటగా కర్షకాభ్యుదయానికి అడ్డువచ్చింది. కనుక కవితలో కర్షకయుగము ప్రతిఫలింపవలసిన అవసరం కలిగింది. ఈ అవసర విశేషమును అందించేదే ఈ కర్షక ప్రబోధము.

"ధర్మమోక్షాలు పురుషారాలు కావు. అర్థకామములే అసలు పురుషార్థాలు. అందులోనూ అర్థపురుషార్థమే మహాపురుషార్థము. అసమ

ష్ఠులయినవాళ్లు ధర్మమోక్షాలు నిబంధిస్తూ కవితలు వ్రాస్తారు." ఆ క్షే భావం ముదురుతూ ఉన్న ఈ దినాలలో కవితాచక్రం ఏదోవిధంగా తిరుగుతున్నది. సత్వబలం సరిగా లేక భావదౌర్బల్యం పట్టినవాళ్లు జాతీయ ధర్మవివేకం న్యూనీకరించుకొన్నవాళ్లు ఎన్నివిధాల అన్నప్పటికీ భారత జాతికి పునర్వివేకవికాసవిశేషములు కలగడానికి దైశికజాతీయ భావ భరితమయిన కవిత రావాలి. కర్షక చిత్తవృత్తులు విశదం కావాలి. అందుకై ఈ కావ్యం యత్నిస్తున్నది.

ఇది ఎవరికి? అక్షరము సరిగా నోటపట్టలేకుండా ఉన్న కర్షకులకు ఇదెందుకు? ఇది ప్రష్టవ్యప్రశ్న కారాదు. మేము కర్షకులం కాదు. అని అనుకొనేవారి భావాలలో కొంతపరివర్తనం అవసరం. ఆ పరివర్తన సంపాదనకే ఈ ప్రయత్నము. అది జరిగితే జాతివికాసం కలుగుతుంది. కనుకనే నవకాలంలో ఆంగ్లసమారాధనం చేసేయువకులు దీన్ని పఠించే అవకాశాలు కలుగచేసికోవాలి. దీనివలన వారికి అనుకూలంగా భావంలో కర్షక చిత్తభావాన్ని అనుమోదింపగల మార్పు కలుగుతుంది. అప్పుడు సామరస్యం ఉదయించడానికి వీలు ఉంది. పాఠ్యగ్రంథ నిర్ణేతలున్నా ఈ అంశమును గుర్తుపెట్టుకొనడము సముచితము.

ఇదొక విధానయంత్రయుగము. మామూలుగా యుద్ధానంతరము గొప్పమార్పు సారస్వతంలో కలుగుతూ ఉంటుంది. మొదటి మహాయుద్ధం అయిన తరువాత వచ్చిన పరిణామఫలాన్ని నేటిదాకా సారస్వతంలో మనము అనుభవిస్తున్నాము. ఈ రెండవయుద్ధం అయిపోయింది. కాని తద్వేగం మనలో పోలేదు. దీని తరువాత జరిగే మహాపరిణామం ఏ విధంగా ఉంటుందో మనంచెప్పలేము. ఎంతో మార్పు వచ్చి తీరుతుంది. అప్పుడు జాతి సర్వపతితం కాకుండా ఉండడానికి సర్వవర్గీణ మయిన వివేక వికాసం ఉండాలి. దానికి తగిన చిత్తవ్యాకోచమున్నా కావాలి. ఇటువంటి మహోద్యమంలో ఎందరో కవులై

కవితలు సారించాలి. ఆ విధానంలో అడుగువేస్తూ కవితా ప్రసారం చేస్తూ ఉన్న కోట సోదరకవులను హార్దముగా అభినందిస్తున్నాను. సాహిత్య లక్షణాలను చెప్పి వాని సమన్వయము ఈ పుస్తకంలో ఏవిధముగా ఉన్నదో ప్రదర్శించడము నాకంత రుచిగా ఉండదు. లక్షణ విజ్ఞానం సంపాదించిన హృదయులు, స్వసంవాద మధురంగా అస్వా స్వాదం చేస్తారు. ఆస్వాద విధానానికి ముందుగా ఒక కుంచికను మాత్రం నాయీ మాటలలో విని వేదనంచేశాను. ఈ కర్షక ప్రబోధం యువహృదయాలలో నవచైతన్యల కలిగించాలని ఆశిస్తున్నాను. ఇక కవితా స్వాదంచేయదలచిన పతితలకు నేను నేనుగా అడ్డు ఉండవక్కరలేదు.

శ్రీ మాధవరామశర్మ,

నవ్యసాహిత్య పరిషత్తు : గుంటూరు.

తాలి : ౧౯౪౬ పార్థివ పుష్యము

# మనవి



"భిన్నరుచిర్హి లోకః" అన్నట్లు కవులలోకూడ వేర్వేరు అభిమతములుండును. కొందఱకు భావాధిక్యత అభిమానము. మఱికొందఱకు శైలి యిష్టము. వ్యక్తియందు, అవ్యక్తముగా అంతర్లీనమైయున్న ప్రతిభనే, కవిత్వమంటారు. కవిత్వము భావరూపము. దీనికి కాలమానము లేదు. కవితకు ముఖ్యాంగము ప్రతిభ. ఇది లేనివాడు, కైతల్లలేనివాడు. ప్రతిభ జన్మాంతరీయతపోలబ్ధము. కంటియందు పాప, మధువులో మాధుర్యము లీనమైనట్లు కవియందు కవిత్వము కలసియుంటుంది. నేటికాలంలో కవిత్వము సర్వులకు అందుబాటులోనుండేలాగు రచించవలెను. కవిత్వము వ్రాసేవారు నేడు భిన్నభిన్న నామములతో వ్యవహరిస్తున్నారు. ఈ భిన్నత ఉపాధి భేదంతో ఏర్పడిందే కాని కవిత్వమంతా ఒకటే.

మనవారు నేటి కవిత్వమును కొందరు భావకవిత్వమని, నవ్యకవిత్వమని, పిలువ సాగినారు. ఈ భావకవిత్వము, మన ప్రాచీన శతకములయందణగి యున్నదేయని మనవి చేస్తాము. నేటి రచన విశ్వజనీనదృష్టి కలిగి భావసర్గలో జాలువారాలి. సత్యజ్ఞానోద్భవం కాని రచనలు కాలవాహినిలో కలసిపోతాయి. కావ్యమునకు జీవం ధ్వని. కావున నే భారతీయ గృహధర్మ ప్రతిబింబితమైన ధ్వని. ప్రధానమైన రామాయణము ఏకాలానికి నశింపనిది.

మన భారతభూమి రత్నగర్భ, ఆమె ప్రియకుమారుడు రైతు. అన్నవస్త్రాదులకు ఏలాటి లోటురానీకుండా సాకుతుంది మన భారతమాత. అదంతా కృషీవలుని కష్టమే. కాని ప్రపంచములో వ్యవసాయ మెప్పుడు ఆరంభమైందో తెలిసికోడానికి ఆధారాలు కనిపించవు. అనాది కాలాన్నించీ రైతులు స్వతంత్రించి తమ పెత్తనాలు తామే జరుపుకుంటూ వచ్చారు. దానికి తార్కాణ పంచాయతీ పెత్తనమే. దాదాపు ఆరువందల ఏండ్లు పరిపాలనా బాధ్యత తమ భుజస్కంధములపై మోసినారు రైతులు. సృష్టియందలి సర్వుల పోషణం తన నాగేటిచాలులో ఉన్నా గర్వించడు రైతు, అందుకనే ప్రాచీనకాలంలో సంఘములో

అతనికున్న గౌరవం మరో వ్యక్తికిలేదు. ఈనాటికీకూడ అదే కారణ మూలంచేతనే పల్లెల్లో గౌరవిస్తారు కష్టించి పనిచేసేవారిని. భూభారం భరించే సార్వభౌముడు, జప హోమాదులు చేయు విప్రుడు, హాలికుడు సమానగౌరవ ప్రతిపత్తులందదగినవారు. వాస్తవంగా చూస్తే మన దేశములో ఉన్న సారవంతమైన భూవిస్తీర్ణము మరొకచోట లేదు. ఇంతటి నిరుపేద రైతులు యితర దేశాల్లో లేరు.

రైతుకష్టాన్నిలోకానికి తెల్పుటకై ఆ సేవలు అనేక విధాల తమ కలాన్ని పోనిచ్చారు భావ ప్రపంచంలో. వారందరికి మా జోహారులు.

సామాన్యుడైన పేదరైతు జీవితమందలి ఒడిదుడుకులే యీరచనను పురికొల్పినవి. వాస్తవంలో అతనికష్టం మరొకరికిలేదు. ప్రొద్దు పొడువకపోయి, ప్రొద్దుక్రుంకిన దాక కష్టించినా, ఆ అమాయకుడు, కల్లాకపటంలేకుండ, పొలల్లో, గ్రుడ్డివెన్నెలలో, పదాల అలపించ టంలో మఱచిపోతాడు, ఆ కష్టమంతా, తన చెమ్మటవానచే భూమిని; తడిపి పండించి, చూచి ఆనందిస్తాడు యీ కష్టజీవి.

"కర్షక ప్రబోధము" అనే పేరుతో, రైతును, అతని జీవిత మునుగూర్చి, కొన్ని భావాలను యీ రూపాన బయలుపరచినాము. సుమారు ఆరేండ్లనాడే యీ రచన పూర్తినొందినదినది అనంతములైన అంతరాయములవల్ల యింతవరకు బయల్పడక పోయింది పుస్తకరూపమున.

ఈ గ్రంథ ప్రచురణకు మమ్ము ప్రోత్సహించిన శ్రీ. యన్. జి. రంగా, శ్రీకొటూరి నారాయణస్వామి, శ్రీ. ఏ కేశ్వర్, శ్రీ. పంచాగ్నుల శర్మ, శ్రీ కాశిహాస్తిరామనాథం గార్లకు మావందనము లర్పిస్తాము. ఈ గ్రంథ ముద్రణకు ద్రవ్యసహాయము నొసర్చిన మిత్రులకు, ఉదారులకు, సహృదయులకు అందరికి మేము కృతజ్ఞులము.

పరిచయవాక్యం వ్రాసియిచ్చిన శ్రీ మాధవరామశర్మ గారికి మా వందన శతము లర్పించుకొంటాము. ప్రమాదవశమున దొరలిన లోపములను విజ్ఞులెరిగిస్తే దిద్దుకొంటాము యీ మారుము ద్రణలో:—

పార్థివ - పుష్యము. }

నమస్తే,
రచయితలు.

భావవీథీవిహారుఁడై పరగుసుకవి
కవిత నలరించు లేఖిని కరముఁబట్టి
సీరమును దాల్చి జగముఁ బోషింతువీవు
మూరకేదార వీథీవిహారి వగుచు. ౫

జానెడుపొట్టకై వృషభచస్సుల నాడవు; వేగుదాక డెం
దానకరమ్ము వెట్టుకొని దారసుతాదుల తోడ నిద్దురన్
బోనెవఁడోపు నీకరణి, పూజతె మాధవనీయవృత్తి, నీ
వేనిముసమ్ములోన జననీ ఋణముక్తుఁడవౌదు సోదరా! ౬

హాలికవర్యా! నీదుకృషియమ్ము లిఖింపఁదలంపుఁ గల్గు మా
కలము నిరంకుశప్రతిభఁ గాంచుట ప్రస్తుతకాల చిత్రమో,
కలిమివహింపఁ గల్గునొ, కారణమెయ్యదియైన వ్రాయఁగాఁ
దలపడినాము స్వాయుకవితావనితా మహితాదరంబుగన్. ౭

"హాలికులా! యటంచు పరిహాసములాడెడి మంది యుందిరా
లోలప పార్చ్య వాఞ్ఛగత లోభముచే బమ్మెన పోతనార్య నా
హా! అవపేని సత్కవిసమాఖ్యకు లోపము గల్గెనే? జనుల్
మేలగు సేద్యవృత్తికలిమిన్ గడియింపరొ కో! స్వతంత్రులై. ౮

"ఇది నా దేశము, నా స్వతంత్రమున నన్ సస్యక్షేత్రమందొక్క కేల్
కరిగాఁ జేసివచింపఁ జాలు జగతీ కళ్యాణముఁ జేవ్యంపనన్
ముదమేపార" కృషీవలుండనుచుఁ భూమిన్ మనీషానిధుల్
అనిరా! జీవితమెంతయైన భవనీయంబే కృతార్థంబగున్. ౯

వెలికృత్తు లెన్నియైనను
కులవృత్తికి సాటిరావు క్షోణిని నరెపె
ద్దలు లోకానుభవజ్ఞులు,
హాలికులవర్య! వినతేజ! యీవాక్యములన్. ౧౦

నలువురతోఁ బాటు నగలు లేవని యాలు
గొనఁగఁ జోడెందానఁ గుంది కుంది,
పాలబుడ్డికి చంటి పాప పోర్వెట్టఁగ
కాసైన లేమి దుఃఖమ్ము నెందిది,
కూతురి పెండ్లిఁ గూర్పఁ ద్రవ్యము లేక
పాణిమాయకము వెట్టి కలఁతనంది,
బంధుగులే తేర విందులొనర్పఁగ
చిల్లిగవ్వయు లేక చింతఁ బొంది,

దినదినంబొక యుగముగాఁ గనిచరించు
నౌకరిత లంఛ నీడ! యేనాటికైన
కర్షకా! యిట్టి ప్రతిబంధకములు కలవె?
బ్రతుకునన్నాళ్లు నీవలె బ్రతుకవలయు. ౧౧

జీతము గొఱ్ఱెతోఁక, సుఖజీవిత మా మృగతృష్ణ, యెప్పుని
రీతికి వాలవాలము, శరీర బలమ్ము హుళక్కి, సాధు వా
క్పాటిన ఛత్రప్రసూనము, వినోదన హీనప్రవాస్య వృత్తిలోఁ
బాతరలాఁడు నౌకరి విపన్నుఁడు నీసరిగా నెసంగునే! ౧౨

ఉద్యోగాల్ మెతుకులు తనకున్నమటుకు
తినిన తినకున్న యడిగెడు జనులు లేరు
పరుల మెప్పులకై భంగపడుటకంటె
పస్తుపడియుంట సత్కుల ప్రాభవంబు. ౧౩

కష్టార్జితంబైన కలినీటి బోనంబె
సరసమృష్టాన్న భోజనము నీకు!
పడికి నేయించిన ముడికమ్మి గుడ్డలు
చీని చీనాంబర శ్రేణి నీకు!

పలుతెలంగుల కేళిపైరు పచ్చని చేలు
నందనోద్యాన వనమ్ము నీకు!
పూర్వనిర్మితమైన పూరికొట్టంబులె
మణిమయ స్వర్ణహర్మ్యములు నీకు!

రమ్యశాలి సుక్షేత్ర సామ్రాజ్యమేలు
రైతుకాలమునఁ బొడమిన రాజవీవు
నీకుఁగల్గిన స్వాతంత్ర్యనియమ విధులు
చక్రవర్తికి లేవు; నిస్సంశయముగ. ౧౪

స్థిరపరిశ్రమల గృహమ్ము సేద్యవృత్తి,
వివిధ దేశాల వ్యాపార వృద్ధికరము
వర్తకములెల్ల ద్రవ్యసంవర్ధనములు,
భాగ్యములు సుఖప్రాప్తికిఁ బట్టుకొమ్మ. ౧౫

కష్టపడకున్న ఫలితముల్ గలుగు టెట్లు?
ఎంతకృషిఁజేయు వానికి నంతఫలము
కానిమాటలకన్న మేల్గాదెచేత?
పలుకులకుఁ జేతలకు దూరపథము కలదు. ౧౬

దండుకొండలనైనఁ బిండిచేయఁగఁజాలు
వేఁడినెత్తురుఁ గల్గు వీరకోటి,
పరరాజులకుఁ బక్కబల్లెమ్ములై ధాత్రి
యేలిన రాజ దేవేంద్రవరులు,
నీతిబోధలు పద్యరీతి నొసఁగ్గిన
ధవళకీర్తులు కవి తల్లజులును,
ఆనాటి కీనాటి కావ్యవసాయమే
జీవగఱ్ఱగనున్న సేద్యగాండ్రు,

కాపుకాలమునఁ బుట్టిన ఘనులుకారె?
"కాపుకాప"ని పలుగాకి లోకులనిన
దాన మీకెట్టి గౌరవ హానిలేదు
మబ్బులడ్డిన రవిదీప్తి మాయఁగలదె? ౧౭

పల్లెటూర వసించెడి వాఁడవనుచు
నగరవాసులు లేసిగా నగినయేమి?
పరగనలచేత వైకుంఠపట్టణంబుఁ
జూపఁగలవాఁడు పల్లెలఁ బోపరెండు. ౧౮

మనమున నొక్కటింకొకటి మాటలలో మఱియొండు చేతలన్
దనరఁ జరించుచుండియు కుతంత్రములన్ బచరించు తేనెపూ
సినపిడికత్తు లౌకపటశీలుర ప్రేముడి యాదరించి పా
వనగుణశాలురైన మిముఁ బంచనఁ జేసెడిలోక మక్కటా! ౧౯

ఐనను నీవుఁ గావలయు నగ్గియిఁ కేమిటి పూర్ణ సత్కృపాం
భోనిధులైన రాట్తనయ మోదముతోడ కృపార్ద్రదృష్టి సుం
తేనియు నీపయింబఱుప నెంతటి నైనను లాఘవంబగున్
మానసగౌరవికంబునను మానుష మేకరణిన్ సమంబగున్? ౨౦

దినదినమిల్లు బాధఁబడి తీరవలెన్ గద యంచు నీయెడన్
వనరకు సేద్యపుం బనుల పద్ధతి నీవలె నిగ్రహింపఁగా
జనునె మఱొక్క మర్త్యునకు; సారససంభవుఁ డౌరి కద్దిసా
ధనముగనట్టివృత్తిని విధానముగా విధియించు హాలికా! ౨౧

ప్రొద్దుపొడ్వఁబోయి ప్రొద్దుగ్రుంకిన దాక
తిరిగిరావు నీవు; దేహమలసె
విధిబడులకైన విశ్రాంతికలదు నీ
కాటవిడుపటన్న మాటలేదు. ౨౨

నీ పైరుపంటల వ్యాపార మొనరించి
వైశ్యులు బహుధనవంతులైరి,
నీ ప్రత్తిపంట చే నేతపరిశ్రమ
యంత్రాధిపతులు ద్రవ్యాఢ్యులైరి,
నీ వల్ల నాకరులల్ నెలజీతముల్ గొని
సంసారయాత్రా ధురంధరులైరి,
నీ సేద్యవృత్తిచే నిరుపేదలును ద్రవ్య
వంతులై జీవనోపాధిఁ గనిరి,

నీపరిశ్రమ లేకున్న నిలుచునొక్కొ!
అఖిలభూత సమాశ్రయమైన ధాత్రి
భారతావనీ పూర్వతపఃఫలంబ
వనివచింపఁగదగుదువో హాలికవర్య! ౨౩

పిట్టలకు తిండిగా వరివెన్ను సరము
కడపముంగిట వ్రేలాడఁ గట్టినావు
అతులితంబైన భూతదయా సమగ్ర
మెంత మెత్తనిదయ్య! నీహృదయపేటి. ౨౪

వేళకొకయింత తడిసిన వేఁడిఁ జూపి
మెదుకు నధికారి బెదయుల పదుపు లేదు
నీవు నీ యధికారివి నీతివిడని
కష్టజీవివి అనుజా! జగమ్మునందు. ౨౫

లోకేత్వమ్మును దాకు కొమ్మునిడి పల్కాక్ గాలుకేరాక పూ
ర్వీకుల్ కీర్తిశరీరులై చనిరి; ధాత్రిన్ తద్యశోవల్లికల్
ఆకల్పాంతమునుండునట్లు కనుమన్నా! లోక కళ్యాణమై
నీకాయమ్ము నీకుటుంబమునకున్ నిత్యమ్ము శ్రేయమ్ముగున్. ౨౬

నీతలలోని వాల్కులయి, నీకనుసన్నల చెప్పుచేతలన్
పాతరలాడు చెల్లపనిపాట లొనర్తురు మాలమాదిగల్
జీతపుటాసవిడి, పనిజేసినవారల సంతతత్తు ధా
త్రిని బారఁదోలెదవు, బీదలపాలిటి కొట్టుఁజెట్టునై. ౨౭

చెలఁగు నాకఁటి చిచ్చున కలఁగువారు
పయనమై వచ్చి పోరెదు పాటసార్లు
కడకు నీయింటఁగల సేవ గంజినైన
త్రాగిపోనట్టి దినములు తలఁపలేవు. ౨౮

కాపుకొలంబునన్ భవముఁ గాంచిన వాఁడవు బీదవౌట నీ
లోపము గాదు, వేరుగతిలో పడియుంటివి యెట్టులన్నచో
నీపరిపోషణంబె ధరణీ పరిపాలనమంచు రాజవి
ద్యాపరతంత్రులైన సచివాగ్రణు లాత్మ గ్రహింపకుండుటన్. ౨౯

ఎంచఁగరాని దుర్వ్యథలకింతయు జింతలఁ జెందఁబోక ప్రా
పంచిక భావిభాగ్యమభివర్ధనమున్ బొనరింపఁ బూని, క
ష్టించి యనారతంబుఁ గృషిఁ జేసెదు నీవురవంతయేని మే
లెంచకపోయినారలర రే? మనముందటి మంత్రిసత్తముల్. ౩౦

వృత్తికాంతాళికి ఋతుధర్మ సూత్రము
    తెలుఁగ గాఁ గరపిన గురుఁడెవండు?
ఆలుగన్నలైనను తెలువని సిసువులు
    పాల్ద్రావ నేర్పిన భద్యుఁ డెవఁడు?
కాలంపు పరిమితిఁ గనిపెంజూపాయు బో
    ధ మొనర్చినట్టి సిద్ధాంతి యెవఁడు?
లలిత సంగీత కళా ప్రవీణత మించు
    కోయిల కధ్యాపకుఁ డెవండు?

ఆట్టి పరమేశ్వరుండు గంపంతకన్నుఁ
దెఱచి, తిలకించు నిను దయాదృష్టిపరత
గాసపడఁబోకు మనుజసాహాయ్యలవము
ఱికము గాఁడది పెదవుల తేనెలట్లు. ౩౧

కలియుగ ధర్మమాట కడగండ్లు ఘటిల్లె రవంతయైన చిం
తలకుఁ దలంకబోకు సతతంబది నిల్చునె? కొన్నినాళ్ళు వె
న్నెల మఱికొన్నినాళ్ళు ధరణీస్థలి చీకటి కాలచక్ర సం
చలనవిభేద మార్గముల సంభవమౌ సుఖదుఃఖ జాలముల్. ౩౨

పేదరికంపు టేటికతివేగముగా నెదురై ప్రవాహము
న్నీఁది కుటుంబపోషణకు నిట్లు శ్రమంపడుచుండు నీవె మా
కాదరువంచు నెంచిరి జనాళి తదాదిగ నీకులాభ సం
పాదనకై త్రిశుద్ధిఁ బలుపాట్లు పడందలవాని రిప్పుడే. ౩౩

దడుపడ శీతము బాసె, నంతయుఁ బ్రశాంతంబైన స్వాతంత్ర్యపుం
గడులే రొండఁజరింపఁ జూమ్మికను నీకార్యమ్ము సాఫల్య మె
ప్పుడు నీనాఁగలి సాగదో యపుడె హాహాదే ప్రపంచంబు గ్రు
క్కెడుపుల్ నీళ్ళకు మోము వాచి? ధరకీవేదిక్కు యోజింపఁగన్. ౩౪

"పండిన పండకున్న నెడబాయదు శిస్తు"ను కాలమేగ, నీ
కుండెడు కష్టనష్టముల నోపికతో గమనించి మిమ్ములన్
దండవసింపఁజేసి ప్రమదమ్మునఁ బ్రోచెడు కాలమిద్ది, యు
ద్దండపు శాసనాల కెడదన్ భయమొందకు మింక హాలికా! ౩౫

రైతు ఋణభార ముక్తికర ప్రధాన
చట్ట నిర్మాణమందున నెట్టి యప్పు
లైన నెగవేయఁగాఁ జెల్లునంచు తలఁపఁ
బోకు, మందఱి కర్షంబు మూలమరయ. ౩౬

ముందటి యట్లు కాదు, జనపూజ్యులు పాలకవర్యులద్దిరా
బందుగులైరి, రైతు ఋణభార విమోచనఁ జేసినార లా
నందము కందళింప నిదె నాఁగలి కొండికిఁ గట్టి పొమ్ము నీ
యుందగు మేలు చేకురును సంతత సత్ఫలదాయకంబుగన్. ౩౪

గతముగ తమ్ముగాఁ దలఁచి, కొంగల ప్రస్తుత కార్యసాధనో
ద్ధతమగు యత్నముల్ సలిపి, ధారుణి సస్య సమృద్ధిఁ జేసి, సం
తత శరదాభ్రకీర్తిఁగని తామర తంపరలై సుఖించు మా
అతులిత భోగభాగ్య విభవాన్విత భారతమాత పొంగఁగన్. ౩౫

తొగరు కెమ్మోవి నవ్వుదుం దుడుకుఁ జెంద
కమ్మి కుచ్చెల మడమల కడలఁ జీఱ
నెదురుగా కాపు కన్నియ యేగుదెంచె
ఇంతకంటెను శకున మింకేది గలదు? ౩౬

"అకటా! కొత్త్రైలురి త్త్రలై చనియె తేదాయంగదా! వాన బొ
ట్టిఁక యంచున్ దిగులొందనేల, కనుమా! యేతెంచె కాలాభ్రముల్
సకలాశా పరిపూర్ణుఁడు జ్వలదయా స్వాంతుండు జీమూతమే
చకగాత్రుండు, ముకుందుఁడంచవని పైఁ జాటించు చందంబునన్

ఇమ్ముగ వానకార్తె సమ వృష్టి నొసంగక యున్ననేమి, నీ
చెమ్మట వానకున్ దడిసి చేలు ముదావహమై ఫలించు, నే
త్రమ్ములకున్ వినోదమున దావల మాగద సస్య లక్ష్మికిన్,
ఇమ్మహి నిన్నుఁబోలు గణనీయ చరిత్రుఁడు లేఁడు చూడఁగన్.

సరసీజీప్రభ వాండ భాండముల బొజ్జన్ నిల్పి, తద్దత్త ప్రా
పరుఁడై వర్తిలు మాధవుండు కరుణాపాథోధి పైరల్ల భా
స్కర తీవ్రాతపధాటి నాపఁగను పేక్షా దృష్టి వీక్షింపఁడు
ర్వరఁ బుట్టించినవాఁడు పూరి యొసగన్ బ్రాల్మానునే, హాలికా

వర్షము బాగుగా గురిసె, పైరతిగా ఫలియించు గుర్తు'ని
ప్కర్షఁగ తోఁచె, నేటి కిక జాఱము సేయఁగ బొమ్మ వేగమే
వార్షపరీత మానసుఁడవై హాలముఁగాని వర్తమాన సం
కర్షణుఁడో యటంచు నిను గాంతురు, లోకులు మూఁగి వీథులన్.

దున్నుట మొదలుగా నన్ని లావు కొలంది
యదను గుర్తెఱిఁగి చేసెదవు నీవు,
గృహకార్యముల నోర్చి యెల్లను దీరిచి గడ్డి
గాదముల్ దెచ్చు నీ కలికి మిన్న, ౫౦

ఆకలి దప్పుల నరసి వలంతిగ
కదుపులఁ గాయు నీ కన్న కొడుకు,
ఒడిసెలరాల్ రువ్వి బుడుత పిట్టలఁ దోల
జేలఁ గాపాఁడు నీ చిన్నతనయ,
ఇల్లు కనిపెట్టికొనియుండి యెల్ల వేళ
తాలిమి వహించి నీ తల్లి నూలు వడకు,
రమ్య రీతుల దేశోద్ధరణ మొనర్చు
నీదు సంసారమున కీడు లేదు ధరణి, ౫౧

ఒక్కఁడు కాయకష్టముల కోర్చి ధనమ్మును సేకరింపఁగా
బెక్కురు తిండిపోతులయి పేరిమినుందురు లాతు లిండ్లలో;
నొక్కరుఁ జేనసోమరిగ నుండునె! మీ కొలమందు; సంపదల్
దక్కిన మీకుఁ గాక వసుధన్ మఱియెరికి దక్కు, సైరికా! ౫౨

దిగులొకింత యెఱుంగక బాగలకుండ,
ఆలుబిడ్డలతో సౌఖ్య డోల నూగి,
జగతి స్వార్థపరార్థముల్ జరుపుకొనెడు
వర మనీషులు కారె! మీ వంశభవులు. ౫౩

భావి స్వతంత్రత జీవితము ఘటించు
    స్వారాజ్య సంలబ్ధ సాధనంబు,
తీవ్రంబుగా భారతీయులఁ బీడించు
    దారిద్ర్య భూత నివారణంబు,
విద్యాధికుల నైన వీడక బంధించు
    దాస్య బంధ ప్రవిదారణంబు,
కడుపు నిండఁగ పేద గంజికి నల్లాడు
    కర్షకచయ ముక్తి కారణంబు,
    భరత మాతకుఁ బ్రియము నై బరగు నెద్ది,
    రాట్నపుం బరిశ్రమముతో రానిదేది ?
    ఇట్టి సులభ మార్గ ప్రక్రియ నెఱుగ లేక
    బ్రతుకుచుంటిమి యజ్ఞానవశత మనము. ౨౪

ఇమ్మెయి కష్టనష్టముల కీవు గడంచిన విత్తమెల్ల సౌ
ఖ్యమ్ముగ పొందఁ గల్గితివి, కష్ట సమార్జితమైన సొమ్ము భో
గ్యమ్ముగఁ గాని, నీచగతి నార్జనచేసిన ద్రవ్య మంతయుఁ గా
వమ్మగు. నగ్నిచోర నరపాల వశీకృతమై కృషీవలా ! ౨౫

నష్టము గల్గునంచును మనంబున భీతిఁ దొలంగి, పూర్ణ సం
తుష్టి వహించి. నీ పనులతో జరిగింపుము దేహ యాత్రలన్
కష్టముసేయు దాని కనుకూల ఫలంబులు కల్గు తప్పకన్
కష్టము లొందకుండిన సుఖంబులు తియ్యదనంబు లెట్లగున్. ౨౬

గునపము, పాఱ, లాంగలము, గుద్దలి మున్నగు సాధనంబులన్
గొని, వ్యవసాయ వృత్తి కనుకూలముగా నిల కీవు గొప్ప బా
ధను గలిగింప, సస్య సముదాయము నీక యొసంగు ధాత్రి; మ్రొ
క్కిన భగవంతుఁడిచ్చునె యభీష్టము ? మొట్టెడువారికేకదా! ౨౭

పంజరని బద్ధ కీరంబువలె జనంబు -
స్వేచ్ఛకై పోరుచున్నారు వివిధ గతులఁ
బుట్టు టాది స్వతంత్రపుంబట్టు కొమ్మ
వగుట, నీ కెవ్వరిల సాటి యౌదురన్న. ౫౮

తూక కన్నులఁ జూచి వాకొనఁగాఁ జాలు
న్యాయవాదుల ముని వ్రాళ్ళపైన,
మనవిచ్చి నట్టుల మాయల బేహారి
త్రాసు తూనిక కట్టు రాళ్ళపైన,
ఇచ్చి నవియు సాన తెచ్చి కొల్వఁగఁ గొను
పడుపు తొయ్యాలి కులుకు వవలయందు,
కులుకు తీయదనానఁ గొలిచి వడ్డనఁ జేయు
పూట కూళ్ళమ్మచే పొంక మందు.

టక్కు టెక్కు టమారమిటారి చెలులు,
తన్ను కను సన్నఁ గొల్వ ధర్మదేవి,
కొలువుఁదీరును గాని, నీ తలపునందు
మందునకుఁ గాని. బూటక మెందు లేదు. ౫౯

అనుపమానంద మోక్షసాధన పరత్వ
మును గడింప, భక్తుండు దేవుని భజించు,
విశ్వ కల్యాణమై కులవృత్తి చేయు
నీవు భక్తుని కంటె మనీషి వన్న! ౬౦

పరిగంచుల్ గల కండువా తలకు, దోస్తంభంబులన్ వ్రేల, బూ
షరముల్ క్రొమ్ముడి కీలుకొల్పి, యౌవ్వనశ్రీలతోఁ గూడి ప్రే
మరసోద్రేక వచో విలాసముల బంతాలాడు చొక్కప్పు జే
పరదాగాఁ జరియింప వెన్నడఁను, సంసారాబ్ధి మగ్నుండవై. ౬౧

కరిరథపత్తి సైనికనికాయముతో నరివీర రాజులన్
తురమునఁ బోరి గెల్చి జయతూర్యనినాదము మిన్నుముట్ట రా
జ్యరమను మాపు పైనిలిపి, న్యాయము దప్పని పాలనాధురం
ధర చిర కీర్తి శాలురు కదా! మును పెద్దలు రెడ్డి పుంగవుల్. ఉ॥

ఓయీ! భవత్కుమారుఁడడుగో! పొలిమేర పొలాల గోతతుల్
మేయుచునుండ నాస్థల సమీప విశాల మహీజ శీతల
ఛాయల విశ్రమించి, సరసంబుగ పల్లె పదాల గేయముల్
కోయిలయట్లు పాడు పథికుల్ తలలూపి ముదాన మెచ్చగన్. ఉ॥

అవని యొకానొకప్పుడు మహార్థిక సాంఘిక రాజకీయ వి
ప్లవమున దారుమారయిన భారత పుత్ర! రవంత యాత్మ గౌ
రవము, వృత్తి గౌరవ తిరస్కృతిఁ జేయక తొంటియట్లు మా
నవహిత కార్యదీక్షను దినంబులు బుచ్చుము సార్థకంబుగన్. ఉ॥

దేశ దుర్భిక్షను నాశ మొనర్చెడు
వృత్తియున్నదె సేద్య వృత్తి గాక !
స్వాతంత్ర్య జీవిత స్థాపన దీక్షకు
వృత్తియున్నదె సేద్య వృత్తి గాక !
స్వార్థ పరార్థ కార్యారంభ నిష్ఠను
వృత్తి యున్నదె సేద్య వృత్తి గాక !
కర్షకాన్వయ నైజ గౌరవ ప్రతిష్ఠకు
వృత్తి యున్నదె సేద్య వృత్తి గాక !

కడు నిరాడంబర మగు, నేకాలమందు
మూలకారణమైనది, ముక్తికరము,
అన్ని వృత్తుల మేల్బంతి యున్నతముల,
హలము చేఁబట్టె బలదేవుఁ డంత వాఁడు. ఆ॥

గోత్రాధిపతులాది కూలీలు గడపెడు
జీవితయాత్రకు జీవగఱ్ఱ.
స్వార్థపరార్థాల కనుభోక్తమైనట్టి,
పాడి పంటలకు మేల్పట్టుకొమ్మ,
ఉన్నంతలో తృప్తి నొనరించి స్వాతంత్ర్య
ప్రాసాదమునఁ జేర్చు రాజబాట,
పరదేశములతోడ విరివిగా సాగించు,
బేరసారాలకు వెన్నుబూస.

పంట పొలతికి కల్యాణ మంటపంబు,
పూర్వులకు ప్రేమ నిచ్చిన మూలధనము.
ఇందు నందున సౌఖ్యముల్ పొందఁజేయు,
సైరికాగ్రణి! నీ వ్యవసాయ వృత్తి.

వడ్డితోడ నెందు వడిగల గుఱ్ఱంబు
పఱుగు లెత్తలేని గుఱుతు తెలిసి
ఆయువు బేర మెప్డు డాడఁగాఁ బోకుము
కొట్టు కెప్పుడైన, కోలుకొనరు. ౬౭

అప్పటియట్లు మీరలు నిరక్షరకుక్షులు గారు; చూచుచో
నిప్పుడు జ్ఞానభాండములయినారు భవత్కులమందున్ స్వేచ్ఛగా
మెప్పిరిగొన్న మోదమునఁ బ్రొద్దులఁ బుచ్చుచు లోకమెల్ల మీ
గొప్పతనంపు కీర్తనలు కూరిమితో స్మరియింపఁ జేయుచూ ... ఉ.

అతిరాసక్తి నవనాగరీక విధులన్ వ్యామోహ బుద్ధిన్ ప్రియం
బతి "కాఫీ" కొఱకైన త్రాగుడుల సేవన్ జొచ్చి విత్తంబుకై
మతి వాణిజ్యముల నాడు ధ్యానమునకే మాత్రంబు భావింపకు,
వ్యాపృతి నంసారము ఛిన్నభిన్నమగు – మీ మర్యాద లోపంబగున్.

మంతయుఁ సావధాన పరిశుద్ధ మనంబున నుండు మొక్కట్టిద్ది
ప్రాంతముగాఁ జెప్పెదఁ గథన్ విను మీ యొక యూరనొక్కఁడు శ్రీ
మంతుఁడు కాపువారితల మానికమందగు నాగిరెడ్డికిన్
కంతు జయంతులాకృతులు గ్గిరి; నందనులా పుత్రులొప్పఁగన్. ౧౦

అతని యిల్లాలు శ్రీజగదంబ శుద్ధి,
వంశగౌరవ మభివృద్ధిఁ బఱుపఁజాలు,
నఖిల సద్గుణ రత్నాలకోట పట్టు
సార్థకతఁ జెందు, పేరు సీతమ్మ యనఁగ. ౧౧

పెద్దినాయఁడు, రాముఁడన్ బేర్లతోడ
పెద్ద చిన్నకుమారులఁ బిలుచుచుండ్రు
పెద్దినాయఁడు గుణముల బెద్ద యయ్యె;
రాముఁడును దుర్గుణగణాబ్ధి రాముఁడయ్యె. ౧౨

పెద్దనాయఁడు తన యింటి పేరు నిలుప
కాల మొకరీతి పోయిగాఁ గడపఁ దలఁచి
సాగుచేసి ధాన్యంపు రాసులను దెచ్చి
గాదెపుటికెల నిండించె కాపు లలర ౧౩

నాటినాటికి నా పెద్దినాయు నిల్లు
పాఁడి పంటల తులతూఁగి భాగ్యలక్ష్మి
కనిశ నర్తనాగార యోగ్యతఁ, జెలంగు
పావనంబగు కులవృత్తి వర్తనమున. ౧౪

తన యింటిలో గంజి ద్రాగి సంతోషింపఁ
జాలని చుట్టుపక్కాల వారు
తన పంట కళ్ళాల ధాన్యపుంగంకుల
బ్రీతి వహింపని బిచ్చగాండ్రు

తన సపర్యల కాత్మ దనిపి యాశీస్సుగాఁ
గైత వచింపని కవిజనమ్ము
తనమాట మర్యాద ననుభవమ్మున గాంచి
సారె మెచ్చని యధికారవరులుఁ.

తన మనోవీథిఁ దోచని ధర్మనియతి
తన హృదయముఁ గొనని వేద జనము
తనకుఁ బండని మేలి పంటల రకాలు
కలికమునకేని యుయ్యెడఁ గానఁబడవు. ౨౫

రాముఁడు బికారివలె కొన్ని భూము లమ్మి
బొమ్మలాటలు, కోడి పందెమ్ములాది
వ్యసనములఁ జిక్కి, ధనమెల్ల వ్యయ మొనర్చి
కుడువఁగట్టఁగ లేక గగ్గోలు పడియె. ౨౬

ఆరయ జారచోరులకు న్యాయవివర్జితకోటికిన్, ముఖా
కారులకున్ గృహంబు తలఁపఁగూడదని చెప్పెద గంగనాని. యా
గారము నిత్యమా యినుపగజ్జెల తల్లి వసింప నొప్పెడిన్
గౌరవహీనుఁడై బ్రతుకుకంటెను మృత్యువు మేలు కూడఁగన్.

కులము దూషింపఁగా, భార్యగోడు చెంద,
బ్రతుకుఁదెరువు నశింపఁగా రాముఁడీగ్గె,
చెడ్డవారలతో మైత్రి చేటుదెచ్చె
గానకూడదు చెడు చెలికార మెందు. ౨౭

మనకుఁ గొరగాని యలవాట్లు మరిగి, తిరిగి,
తగిన కులవృత్తి మాని, నిందలను మోసి,
చెడక సత్కులాచార సచ్చింత మనుచు
కులము వారలకున్ పండ్లు పులియనట్లు. ౨౮

తన కులవృత్తిని వెలిగా
గని పరవృత్తిని జరించు కాపురుషు లిలన్
జన దూషణ పాత్రాదురు
గన రున్నత సౌఖ్యములు జగంబున నెందున్. ౨౦

"వెలివృత్తు లెన్ని యున్నను
కులవృత్తికి సాటిరావు, క్షోణీస్థలిపై
వెలకొంత తెంద యుండిన
గులకొంతయె మేలు" ను పలుకుల్ విందువుగా. ౨౧



# కర్షక ప్రబోధము



## రెండవ భాగము



కపట సన్యాసి ధ్యాన యోగమ్మువలెను
కన్నులఱమూసి, నిద్దురఁ గాంచు కోడి
కూయ మొదలిడె — జాముల గుర్తుఁ దెలిసి
విధి నియామకమా కాలవేది యేమొ!

కాల మమూల్య, మద్ది వృథగాఁ జననిచ్చిన వేఁడుకొన్న రాఁ
జాలదు, బుద్బుదాకృతిన శాశ్వత మాయువు, మొద్దు నిద్దురన్
జాలము లేల? మీ పనులు సల్పఁగ లెండిక మర్త్యులార! యం
చాలపు పుంజు కూత వినవా? తెలవాకిలి ముందు హాలికా! ౧

తోడి కొప్రులు తమకొడిక నట్టిల
బూన్పఁగా గంటల మ్రోత లవిగొ!
పాల్ ద్రావ చెంగునఁ బరువెత్తు లేఁగల
"అంబా" యనెడి నినాదంబు లవిగొ!
పసుల వెంబడిఁ బోవు పసి కాప కొమరుల
జాతీయ గీత నిస్వనము లవిగొ
కడలని నిసువుల కదలి నీ పతిమతి
దధి మథియింప నాఖ్యాన మవిగొ!

కరయుగంబుల కంకణ క్వాణములకు
కంచు మెట్టెల సందడి మించితనర
కాపు చేడెలు బావికిఁ గదలివారు
లెమ్ము కర్షకా! నిద్దుర లెమ్ము వేఁగ. ౩

అంటి యంటక మున్నె పెల్లాగడమున
యఱచి, పరుగెత్తి, యేడ్చు, గయ్యాళియాలి
పగిది - మ్రోగ సా, చేదుడు బావి గిలక.
లెమ్ము సైరికా! నిద్దుర లెమ్ము వేఁగ. ౪

సరసుల తమ్మి కొమ్మలను చక్కిలి గింతల నేత్ర పత్రముల్
తెలుపఁగఁజేసి సస్యసుదతీమణి మాంద్యమువాపియంత భా
స్కరుఁడవె మున్నుసంజ తొలికొన్నెలు చల్లని ముద్దుపిల్ల తె
మ్మెరలు చరింపఁగా దొడఁగె, మేల్కొనుమయ్య కృషీవలాగ్రణీ!

గుమ్మము లూడ్చి దట్టముగ గోమయపుం గలయంపిఁ జల్లి గొ
బ్బెమ్మ లలంకరించుటకుఁ బ్రేముడి తల్లులు నిద్ర లేపఁగా
గుమ్మడిపూలఁ గోయ నరుగో! పరుగెత్తుచు తోఁడువారి నా
మమ్ములఁ జీరు బాలికల మంజులనాదము లాలకింపుమా! ౬

బాబా! నిద్దుర లెమ్ము వేఁగ చలిమంటల్ వేయఁగా వచ్చి నా
రా నాఁడిమ్ముల నేఁడు కొన్నహితులాహ్లాదమ్ము రెట్టింపఁగన్
ఈ నాఁడైనను వేళకుం బడికి బొమ్మా! పంతులేరీతినిన్
నానాఁ డోర్చునటంచు తల్లి పలికెన్ గారాబపుంబుత్రుతోన్.

తంబుర మీటుచున్ లయ విధానము తప్పక నృత్య గీత రా
గంబులు మిన్ను ముట్ట తన బాహువు నందొక జోలె వ్రేల వీ
థిం బఱతెంచె దాసుఁడు విధిక్రముఁడొక్కఁడు నీ కిదే ప్రబో
ధం బొనరించు మాగధు విధంబున నిద్దుర లెమ్ము కర్షకా! ౭

చటుల శకుంత యంత్రముల సల్పఁగ నయ్యె మనోజ్ఞ గీతముల్
పటపట నిస్వనాకలిత పక్ష మృదంగ రవంబు లొప్పె, చీ
కటి తెఱయెత్తఁగాఁబడియె. కాంతులుదిక్కులఁ గ్రమ్మ భానుఁడన్
నటుఁడు, నభోవిశాల తర నాట్య తలమ్ము ప్రవేశఁ డయ్యెడిన్.

ఉర్వీబీరెండ కాకలకుడుకక మును
పూరిపైమంచు తుంపురుల్ పోకమునుపె,
తుక్కపెద్దలతోలు మా తూర్పుదెసల
నిచ్చవేయును; పచ్చను పచ్చికలను.— ౧౨

చేలపైమంచు బొట్టులు చిందులాడ
పంటపొలలికి ముత్తెంపు జంటసరము
నంగనింపు సొంపులతోఁ జెలంగుచుండె;
నగరవాసులు వానిఁగానంగఁ గలరె! ౧౩

విరియఁగఁ బండినట్టి వరివెన్నులు భారముచేత ధాత్రిపై
వొరిగెను; పైరుజాడనయనోత్సవ దాయకమై విధేయతా
గరిమము దోచుచూపఱకు గౌరవనీయుల శేషసద్గుణా
కరుల ప్రవర్తనంబిటులగాదె! కనుంగొనఁగా కృషీవలా. ౧౪

పచ్చికగనివలపై మంచుబిందువుల్
ముత్యాలకాంతుల మురుపుఁజూప,
ఆకాకుసుందుల నలరు పచ్చిమిరప
మరకతరోచుల మఱుఁగు పఱుప,
బారుగా విరిసిన బంతిపూచెండులు
గోమేధికచ్ఛాయ గునిసియాడ,
కొండుగా విచ్చిన గుండుమల్లెల తీరు
పగడాల క్రొంజిగి పసనడంప,

తెల్లగన్నేరు వజ్రపు దీటురాఁగ
వంగపిందెలు నీలాలవలెఁ జెలంగ
గోగుబూలు మానికములట్లు మెఱయ
సొరవిరుల్ పుష్యరాగాల సొంపుఁదవరఁ
గాంచనవ రత్నములచేలు కనులవిందు. ౧౩

ఇంటికేగువేళ యిల్లాలు గర్భిణి
కనుక రెండు జొన్నకంకులఁగొని
పొమ్ము; పారితోషికమ్ముగా నెందైన
గర్భవతులకాస గలుగుమెందు. ౧౪

మాపునఁ జద్దిమంటకపు ముంతలు కఱ్ఱ౯ వ్రేలఁగాతు కో
ద్దీపను లాచమేనంటఁ జనుదేఱఁ దెకుకోఁపు కొమాళ్ళయుందుగా
మాపటి వేళ నీపశులమందర యమ్మన వచ్చెనింటికిన్
చేపెనొపాలు లేగలను చిక్కములన్ సడలించి చేర్పుమా! ౧౫

కొండలబీళ్ళు మేసి పొదుగుల్ కదురువ్రేగ గృహమ్ముఁ జేరి పాల్
చిందెడు కామధేనువుల పేరిటి యావులు కల్గ కంటికిన్
బందువుకొందె నీనిలయవాటి సహోదర పాడిపంటలా
కొంతయుఁ జింతఁ గాఁగలఁడె? కర్షక సంతతిగాక తక్కునన్-
పలుపులువిప్పి పేరెములబారిని జాంబలు మేసనాక, తో
కలుపయి కెత్తిగంతులను చు కమ్మని పాల్ కడుపార ద్రావి, గ
జ్జెలురవళింప గొట్టములఁ జేరెడు లేఁగలఁజూడ ప్రీతియౌఁ
జెలిమల బారసోషకముల చెక్కులయందము పెంపుఁ జేయఁగన్. ౧౬

పొలముల్ కొసరి పైరుచొప్పయటనే ప్రోగేసియుంచ్నారు, కసు
వ్వులు సొర్పిళ్ళయి ధాన్యముల్ గొలిచి గంపల్ కొద్దిగా నింటికిన్
కలితామోదము తోడ తెచ్చితిమి, నీకష్టంబుగ నెట్కు; త
త్ఫలముల్ గాంచితి విష్ణుడే కసులతో, దైవమ్ముతో గాంచె. ౧౭

కులుకుచు రాజశాల వరిఁ గోసెడు కాపుమిటారి కత్తియల్
పులకజనింపఁ జేయుతలపుల్ గలిగింతుచు నెప్పుడేనియున్
కలఁగిత దాశఁ జూడఁదనము, కొటుకకన్నుల నీపడంతికన్
గొలకుల కెంపుసొంపడరు కోపవిషాదము లావరింపగన్. ౧౯

వరిమడికోఁతచే బడలివచ్చిననీకు సపర్యఁ జేసియున్
సరసపదార్థ భోజనము సమ్మతిఁ గూర్చును నీపడంతి యా
ధరణదుకూలదామ ములవర్థిలునే ప్రణయంబునైజ బం
ధురజనితంబుఁ గాని, కనఁదోయికి నింపగు మీసరాగముల్. ౨౦

కలిమి యనేకమార్గములఁ గల్గిన గర్వము నెందకుండ పె
ద్దలుజనియిట్టి గారవపుదారిఁ జరింపుము; లేనిపోని కీ
ర్తులకడియాసలన్ ధనమురూపఱఁ జేసి నిరర్థకుండవై
వెలఁదికి బంధుమిత్రులకు బిడ్డలకున్ వెలిగాకు మెప్పుడున్. ౨౧

కడిచికూర్చుండి, మాయల పుడమి విభుఁడు
రాజ్యదాహంబునన్ కొల్లదవ్వి రేగి
జనధనాది సమస్తనాశన మొనర్చు
సమయమందైన, నీవృత్తి సాగకున్నె? ౨౨

జగతినాల్గు చెఱంగుల జనములాజి
కురికి దేశ సంరక్షణోద్యోగులగుట,
యుద్ధమగు వేళ పంటసమృద్ధి వలయు
మీరలన్నవస్త్రాళి కాధారులుకద! ౨౩

హృదయవచశ్శరీరము లనేకముగాలగి యుంచి ధ్యాన సం
పదలమునుంగు యోగివరమానస ముంబలె స్వచ్ఛమై సుఖా
స్పదమగు జీవితంబునకు సాటిమ లేదగు నీదికాక శా
రదజలదాభ్ర కీర్తిసువిరాజ చరిత్రుఁడ వీవు కర్షకా! ౨౪

# క ప్ర బో ధ క ము

అనుపమకీర్తిఁ గన్నభరతావని హైందవ జన్మమెత్తి, పా
వనముగ జీవితమ్ముగడుపన్ గతిలేకయసహ్యదాస్య యా
తనఁబడకంటె భాగ్యముగదా! నినుఁబోలు కృషీవలాగ్రణీ
కనిచెలుగుల్ ఘటించుకొని కర్షకులన్ తిరిపెంపుఁ గైకొనన్.

ఒరులకు దేహమమ్ముకొని యూడిగముంబవరించుచుండుటే
స్థిరమనియాత్మనెంచి నెలజీతము వచ్చెడుదాక ప్రాణముల్
కరములఁదాల్చి యిట్లుకలకాలము జీవితయాత్రఁబుచ్చుఁ దొం
దరపడు మాయవస్థ యెగతాళికిఁ బాత్రముఁగాదె? సైరికా! ౨౭

అప్పుడే ఫలించినధాన్య మనుభవించి
క్షీరదధ్యాఘృతాది సంసేవనమున
అన్నరో! నీకుమాకు దార్ఢ్యమ్మునందు
హస్తిమశకాంతరమ్ము సుమ్మరసిచూడ. ౨౮

మీవంశోన్నతి మీగుణాతిశయమున్ మీమోదఖేదమ్ములన్
మీవిద్యాదిగుణైక చారుకవితా మార్గమ్ములందిట్టు ల
న్నా! వర్ణించినమమ్ముఁ బోల్కవుల మర్యాదన్ విలోకించుమం
తె? విద్యోచితమౌబహూకృతిగలిన్ వృద్ధిన్ వహించున్ కదా!

ఆరాధింపుము గ్రామదేవతను నానారన్నైవేద్యస
త్కారంబుల్ బొనరించి నీవఖిల భాగ్యప్రాప్తినేమారకన్
పైరుల్ పచ్చల గొడ్డుగోదములఁ గాపాడున్ సదాపీడలన్
పారన్ద్రోలుచు, బిడ్డలందఱను నీపై ప్రేమమెండామెఱుకన్. ౨౯

అంబుజహితుండు, గగనప్రయాణవశతఁ
దడవుజేసెనని వియోగతప్తయగుచు
కడకుడాసిన పొలయల్కఁ గడలుకొనగఁ
గన్నెఱజూపెనొ; పడమరదిక్కాంతకాంత.— ౩౦

పరగమిన్నేటి తరగలపై ప్రియాళిఁ
గూడి సల్లాపములఁ దేలియాడుచుండు
కొదమరాయంచ అట్టులఁ జదలతార
కాగణము పాడసాగెఁ; దిక్తటము వెలుఁగ. ౩౧

చంద్రుఁడుదయించె సత్కళాసాంద్రుఁడగుచు
తామరసవిలాసినులు నేత్రములుమూసె,
కలువపడతులు ముదమున కనులఁదెఱచె,
యెట్టివాఁడైన జగతి మెప్పింపఁగలఁడె? ౩౨

మొగులు పరదాలలోనుండి తొంగలేఁడు
మురియుచున్నాఁడు దాగురు మూతలాఁడ,
చలువవెన్నెల చిలునవ్వు తళుకుఁజూప
యున్నతంబైన పదవియుం దుంటి ననుచు ౩౩

కాళ్ళకెగఁ బ్రాకుసుతుని యంకమ్ముఁజేర్చి
బిడ్డలును, నీవు, తల్లియుఁ బ్రియము మెలర్ప
నారగించుఁడీ వేగ—పిండారఁబోసి
నట్లు కాయు వెన్నెల బైట హాయి గలుఁగ. ౩౪

బుడుత లొనరించు మురిపెంపు నుడులకలరి
పొడుపుకథలచె నొకకొంత ప్రొద్దుఁగడపి
దైవమును నెంచి, వేగనందాక గాఢ
నిద్ర విశ్రాంతిఁ గొనుమ—వి నిర్మలముగ. ౩౫

అనఘులు, లోకమాన్యులు, మహాత్ములు, దాసులు, విశ్వదాతలున్
వినయవివేకులైన పదివేవుర కీవనుజుండవై ధరన్
ఘనతర కీర్తివంతుఁడవు గావిలసిల్లుట దేశమాత పొం
దిన గత జన్మకర్మసము దీర్ఘశుభఃఫల మింతసత్యమూ. ౩౬